అందుమణిగణనికరము...మణిగణనికరము * మనులఘుగురువై । మణివిర మణామయి * మధుదనుజహారుఁ । ఫణిపతిశయనునిఁ * బ్రమథితన రకు । స్మృణిమదయుతనిభు * నిఁబొగడఁదనరుఁ ॥ । న ॥ । న ॥ । న ॥ । న ॥ ‿ సఇది ౧౫౯౭౮ వది॥

వ॥ షోడశచ్ఛందంబగునష్టియందుఁబ్రతిపాదంబునకుఁబదునాఱేసియక్షరంబులై ౬౫౫౩౬ వృత్తములుపుట్టెనందు॥

ప్రియకాంతావృత్తము...అమరులుభృత్యులైన * యవియద్గంగధరిత్రీ। కమలలు । పెండ్లాములు * రవికంజారులుగన్నుల్ । శమితతృణావర్తున కని * చాటుంబ్రియకాంతా। ఖ్యముశివసంఖ్యావిర * మణమైన్యన్య సగంబై । । । న । ‿‿య । । । న । ‿‿య । । ‿ స‿గ ఇది ౧౮౭౭౩ వది॥

అందుఁబంచచామరము...జరప్రజజంబులుఁగముంబొ * సంగితొమ్మిదింటిపై । విరామమొందిసత్కవుల్స * విస్తరంబుసేయఁగాఁ । బరాత్పరుం డుమాధవుండు * పంచచామరంబునఁ । బ్రరూఢగుంభనంబులఁ దుఁ * బాడనొప్పుధాత్రిలోఁ । ‿ । జ ‿ । ‿ ర । ‿ । జ‿ । ‿ర । ‿ । జ‿గ ఇది ౧౬౦౭౫ వది॥

అందుఁబద్మకము... నభజజాగగణయుక్తిఁబి * నాకివిరామక । ప్రభవమై కృతులనొప్పును * బద్మకమందిమై । ప్రభుఁడునక్రమునుద్రుంచి ను * రక్షితుఁజేయసా। మభవపద్మకముచాడ్పున * మానితమైధరఁ ॥। న ‿ ॥ భ । ‿ । జ । ‿ జ । ‿ జ । ‿ గ ఇది ౧౮౬౭౫ వది॥

అందుఁజంద్రశ్రీవృత్తము... కుమంజంద్రశ్రీతోయమన * సరగల్భానువిశ్రా। మముఁసంబంధించున్నరహరి * మాచిత్తచోరా। శమీాయామ్యాగారాశమనసహ * జానాథాకృష్ణా । ప్రమత్తక్రవ్యాదక్షణ దళన * రాధాభుజంగా । ‿‿ య ‿‿‿మ ॥ । న ॥ ‿ స ‿ । ‿ ర ‿ గ ఇది ౧౯౭౯౮ వది॥

అందు–మేదినీవృత్తము-దీనిసేరేవాణియు....మృదయతినజ్బజర్గములు * మేదినీసమాఖ్యఁ । దడబడుచుండఁగాఁదనరు * దంష్ట్రిపద్మనాభా । జడనిధితల్పనందనుత * సాళ్వరాట్కృతాంతా । కడుహితభక్తినీకు

నతి * గావుమయ్యదేవా ॥ ॥న।౹।జ౹ ॥ భ । ౹।జ౹।౹ ర౹గఇది౩౮౦౩ వది

అందు-ఫలసదనవృత్తము నననననగములుద* నరఁగదశవిశ్రాం। తినిఫలసదనముల * తిశయమగుచొప్పున్ । మునిజనహృదయములఁ * బొలుచువానిన్ । గొనబుగముదమొదవఁ * గొలిచెదమటంచున్॥ ॥న॥న॥న॥న॥౹స౹గ ఇది ౧౮౦౦౩ వది॥

అందు-నశ్వగతివృత్తము...అందములైనభకారము*లైదునుగాంతమునై। పొందిపదింటవిరామముఁ * బూనినయశ్వగతిం । గందసమానమహోన్నత*గాత్రునిశౌరిగొ। విందునిఁబ్రస్తుతిసేయఁగ*వేడుకయయ్యెఁజుమీ౹॥భ౹॥భ౹॥భ౹॥భ౹॥భ౹గఇది౩౧౯౮౭వది

అందు-మదనదర్పణము...చారుమదనదర్పణంబుభ*న్జరజ్గముల్దగున్ ।మారవిమతవిశ్రమంబున * న్మహింజెలంగునా । భీరులయమునాతటంబునం * బ్రియంబుఁజేసియా । ధీరవరుఁడుగూడెనంచుభ * క్తినన్నుతింపఁగా॥౹॥భ ॥౹స । ౹। జ౹।౹ర । ౹। జ౹గ ఇది ౨౫౧౯౪ వది

అందు-గజవిలసితవృత్తము...బాలసరోజనాభ * వరదతనుమిళితజం। బాలదిగంబరాస * మసృణకబళకరలం । బాలకమంగళాస * హాగజవిలసితమునన్గ్రాలుభరేఫనాన*నగములిభవిరమమై ౹ ॥ భ ౹ । ౹ర॥న॥న॥న౹గ ఇది ౩౭౫౮౭ వది॥

వ॥ సప్తదశచ్ఛందంబగు నత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియేడేసియక్షరంబులై ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టినందు॥

శిఖరిణీవృత్తము...భజింతున్నిత్యంబున్మునిజనసదా * ప్రార్థనపరున్। గజేంద్రార్తిధ్వంసిం గృతకలలనా * గ్రావునజరున్ । ద్విజశ్రేష్ఠుల్ మెచ్చన్యమనసభవల్ * విశ్వవిరతి । ప్రజాతాహ్లాదంబై శిఖరిణియనా*భాసురమగున్ ।౹౹యా౹౹౹మ॥న॥౹స౹ ॥ భ।౹ వగణము ఇది ౫౯౦౩౦ వది

అందుఁబృథ్వీవృత్తము... జసల్ జసయసంబులుష్ణకర * సంఖ్యవిశ్రాంతులున్ । బొసంగికవిపుంగవుల్ పలుక * భూమిలోఁబృథ్వినా। నసం

శయమగుంగళిందతన * యామునోవల్లభా । ప్రసన్నవదనాంబు
జాధృత*పక్షర్వధామాధవా।U। జ॥U।స।U।జ॥U।స। UUయ
।U వగణము ఇది ౫౮౭౮౯ వది ॥

అందు-హరిణి ... హరిణియనువృత్తంబొప్పున్భాను-రాత్తవిరామమై । స
రిసమరేఫస్వంబై షోడ * శప్రమదాసహా । పరమణుదృణావ
ర్తక్రవ్యాద * సంహారుయ_స్తకో । పరిరుచిరపింఛాచూడంబీత * వ
స్తునుతింపగాఁ ॥న॥UసUUUమU । Uర॥Uస।Uవగ
ణము ఇది ౭౬౧౧౨వది

అందు-నర్కుటవృత్తము ... దీనిపేరేకోకిలకాకము ॥ కొలిచెదనాదిదేవు
పద * కోకనదంబులునేఁ । వొలఁచెదఁదొంటిబాముసఁగు * మెర్వ
డుపాపములం । దలఁచెదనామధేయమతి * తత్పరతజ్ఞభజా । వ
లఁదగులర్కుటంబునను *భర్గవిరామములఁ ॥న।U।జU॥భ।U।
జ। U। జ।Uవగణము ఇది౫౯౨౩ వది ॥

అందు-మందాక్రాంతావృత్తము ... మందాక్రాంతన్గిరిశవిరతు * ల్మభన్
తాగాగణంబుల్ । పొందెన్నాందీపునివలన * సంపూర్ణవిద్యాచయం
బుల్ । ప్రమందించెన్దారుణరణమునం * బొండ్రసాళ్వాదులంజే । యం
దెంజేరెండడుకులకునం * బాత్మజుండంచుఁజెప్పెఁ. UUU మ
U॥ భ ॥ । నUU । త UU । తUU । త UUగగముఇది
౧౮౯౨౯ వది ॥

అందుఁబాలాశదళవృత్తము – దీనిపేరేత్వరితగతియు ... అదనదనునహరి
నుతు* లమరధరఁబొలా । శదళమనఁదనరఁగవి * జనులువచియిం
పఁ । బదునొకొండగునెడయతి* పదిలమునఁజేరఁ । గదియునగణ
ములయిదు * గగముతుదనొందఁ ॥।న॥।న॥।న॥।న॥।న ॥। న
UUగగముఇది ౩౨౭౯౮ వది ॥

అందు-వంశపత్రపతితవృత్తము... బాగుగఁజెప్పనొప్పువసుధఁ * భరన
భనలగముల్ । సాగిపినాకివిశ్రమమున * సభలనుఁగుదుర్చె । రాగి
లువంశపత్రపతిత * ప్రణామునరకు । నాగతనంబునందునిమొ*
నందతనయుఁడనిఁ U॥భU।Uర॥।నU॥భ॥।స।Uనగ
ఇది ౯౪౮౮౨ వది ॥

అందుఁజంపకకేసరియనువృత్తము... సనకాదియోగినుతు * జాంబవతీప్రియు నిర్వికల్పునమేయునక్షరువి* భునన్యమళార్జునభంజనుణ్ | వనమాలిఁగృష్ణుమురభంజనునెంతురువారిజా | సనవిశ్రమంబునజ* సౌస్వలుచంపకకేసరిణ్ ॥ ◡ స । ◡ జ ॥ ◡ స ॥ ◡ స ॥ ◡ స । ◡ వగణముఇది ౭౯౯౨౦ వది ॥

వ॥ అష్టాదశచ్ఛందంబగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిది యక్షరంబులై ౨౬౨౧౪౪ వృత్తములు పుట్టెనందు॥

✝ మత్తకోకిల ...అత్తమిల్లుమహేశవిశ్రమ*మార్యసమ్మతినెప్పఁగా| సత్తుకారసజాభరేఫలు * చౌకలింపుచునొందఁగా| మత్తకోకిలవృత్తపద్ధతి* మక్కువంబొనరింపఁగా | హత్తిపూజయొనర్పవచ్చుజ * నార్దనాహ్వయునెప్పుడుణ్ ◡ । ◡ ర ॥ ◡ స । ◡ జ । ◡ జ ◡ ॥ భ ◡ । ◡ ర ఇది ౯౩౦౧౯ వది॥

అందుఁగుసుమితలతావేల్లిత ... వేమాఱెన్నంగాఁగుసుమితలతా * వేల్లితస్మత్నయాయత్ | శ్రీమార్తండశ్రాంతియుఁగుదిరిసం*జెన్నుమీఱున్ధరిత్రిణ్ | గామేపల్లీశుంగనకవసనుం * గంజనేత్రుణ్శుభాంగుణ్ | గోమద్భాలుంగాలయవనహరుం * గుంజరేంద్రార్తినాశుణ్ ◡◡◡ మ ◡◡ । త ॥ । న । ◡◡ య । ◡◡ య । ◡◡ య ఇది ౧౦౮౫౬ వది.

అందు - నిశావృత్తము ... ప్రబలునిశనునారరా * రంబులన్రత్న విశ్రాంతియుణ్ | గబళితదవపావకా * పూతనాజీవితాహారికృష్ణబలసహాజపారి * జాతాపహారాయసుశ్రేష్ఠదే | వబలదమనవంద్య * బహిర్వ్రతవార్ష్ణేయనైనేయకా ॥ న ॥ న ◡ । ◡ ర ◡ । ◡ ర ◡ । ◡ ర ◡ । ◡ ర ఇది ౬౨౩౮౩ వది ॥

అందు-హారనర్తనవృత్తము...దీనికిఁదొమ్మిదింటనాఱింటయతులు ॥ దావపావకఖాదిమా*ధవచాశార్ఙ్గా*దనుజాంతకా | దేవకీప్రియనందనా* దివిషద్వంద్యా * ధ్రువసన్నుతా | భావగోచరవిశ్వరూ * పదగునాప్రక్రము * వ్వనవర్తనం | ఖ్యావిరామముపరేఫన * జ్యభరేఫంబుల్* హారనర్తనణ్ ◡ । ◡ ర ॥ ◡ స । ◡ । జ । ◡◡ య ◡ ॥ భ ◡ । ◡ ర ఇది ౧౭౨౩౦ వది ॥

అందు-క్ష్మాహారము ... బాహాబాహినిదమలో * భ్రాతల్ దోడ్డ * పగలఁ
బోరాడం | గాహంవీరుఁడగుబుభు*క్షుసూనుంజ * గతిఁగూలంగా |
నాహాయేసిననరపా * లారత్నేషు * యతులుపొందంగా | క్ష్మాహారం
బుమసయత * న్స్యంబుల్ చెంది * మనునునందంబై UUUమ
||| న | UU యUU | త||| నUUUమ ఇది ౭౩౦౮౦ వది
తొమ్మిదింట నైదింటయతులు ||

వ|| ఏకోనవింశతిచ్ఛందంబగు నతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ
బందొమ్మిదేసియక్షరంబులై ౫౨౪౨౮౮ వృత్తములుపుట్టెనందు||

శార్దూలవిక్రీడిత...దీనికిఁబదుమూఁడింటయతి || నీరేజాంచితలోచనాయ
హారయే * నీలాంబుదాంగాయమా | యారాత్రించరఖండనాయ
విభవే * హర్యక్షవక్త్రాయతా | ర్క్ష్యారూఢాయయంటంచుఁగూ
ర్తురునిరీ * హావిశ్వవిశ్రాంతిపి | స్తారింపన్మసజస్తతంబులుగము
న్శార్దూలవిక్రీడితన్ UUU మ || Uస |U| జ||U స UU|
త UU|తUగము ఇది ౧౮౯౩౩౬ వది ||

అందు- తరళ...జలజలోచనుఁగైటభాంతకు * శంఖచక్రగదాధరున్ | గల
శజాదిమునీంద్రసేవితుఁ * గాళియాంతకునచ్యుతున్ | బలుకుచోఁ
దరళంబులందుల * భానువిశ్రమపద్ధతిన్ | గలియనభ్రసజాగ
ముల్ సమ * కట్టిచెప్పుదురుత్తముల్ ||నU||భU|Uర||Uస
|U|జ|U|జUగము ఇది౮౦౬౦౩౧ వది

అందు-మేఘవిస్ఫూర్జితము...పదుమూఁటయతి||క్షమాలక్ష్మీనాథున్ విదుర
వరదున్ * జాహ్నవీజాతపాదున్ | సమామ్నాయస్తవ్యున్ గరుడ
తురగున్ * సామజప్రాణదాతన్ | మిముందాఁ బేర్కొన్ననుభ
లఁదనరు * న్మేఘవిస్ఫూర్జితంబుల్ | విమర్శంగూర్పన్ యమ్నసరర
గము * ల్విశ్వవిశ్రాంతిచేతన్ | UUయUUUUమ || | న
||Uస U|Uర U|Uర Uగ ఇది౭౫౭౧౩౬ వది.

అందు-చంద్రకళ...దీనికిఁబదునొకంటయతి-తానకంబుగఁజంద్రకళావృ*
త్తంబుకవుల్విరచించిరన్ | వీనులారమనోజ్ఞపదంబుల్ * పేర్చిక
పగ్గివిరామమై | కానవచ్చిరసస్తజజంబుల్ * గంబుదనర్చికళింద

జా॥ మానినీరమణా స్తవగాథా * మానితరత్నములందగుఁ ‿।‿
ర॥‿స॥‿స‿‿।త।‿।జ।‿।జ‿గ ఇది ౧౬౭౧౭౬ వది ॥

అందు-భూతిలకము... భారసజాగగణంబులుంబఱ * వంగ భానువిరామవి।
స్ఫారతభూతిలకంబుపాండవ * పక్షదైవతవృక్షమిం । పారధరి
త్రికిఁదెచ్చినట్టి * మహాత్మ్యయంచుఁగవీశ్వరుల్ । చారుపదంబులు
గూర్చిచెప్పిన * శ్రావ్యమావిభువారికిఁ ‿॥ భ‿॥ భ‿।‿
ర॥‿స।‿।జ।‿।జ‿ గము ఇది ౧౬౫౯౭౭ వది ॥

అందుఁగవికంఠభూషణము ... నవరత్నవిశ్రమము * నఁ సజసాసజగంబు
లఁ గవుల్ । గవికంఠభూషణము * గారచియింతురుమాటిమాటికి ।
శ్రవణిల్లుఁగబ్బమున* నందకపాణినుపేంద్రురుక్మిణీ । ధవుసత్కథా
సుధలఁ * దత్పరులైనమహాత్ములట్లుగాఁ ॥‿న।‿। జ॥‿స
॥‿స॥‿స।‿।జ‿ గ ఇది ౩౭౪౦౧౫ వది ॥

వ॥ వింశతిచ్ఛందంబగు కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసి యక్షరంబులై ౧౦౪౮౫౭౬ వృత్తములు పుట్టెనందు ॥

మత్తేభవిక్రీడిత... మనువిశ్రాంతినిసభ నమ్యవములఁ * మత్తేభవిక్రీడి
తా । హ్వానవృత్తంబుచెలంగెమానవతులా*రాఁపిఁడెయ్యేతెంచెభ।
క్తినిగాత్యాయనిఁగొల్చునాడుయమునా * తీరంబునంబొందివే।
డ్కనుమాచీరలు దోఁచుకొన్నవెడదొం * గంజూచినారాయనఁ
॥‿స‿॥ భ‿।‿ర॥న‿‿‿మ।‿‿య।‿వగణము
పదునాలవయింటయతి. ఇది౩౦౭౬౭౫వది

అందు-నుత్పలమాల... పేరినసేయిముద్దములు* పెద్దనుమిఁగడయున్నదా
వ్రజా । గారముసొచ్చిత్రాగివెస * గంతులువైచుమురారినెంచఁ
గా । ధారుణిమూఁధికెక్కునవ * తారవిరామముచేలసమ్భరన్ । భార
లగంబులుంగలయఁ * బల్కనుత్పలమాలచెన్నగుఁ ‿॥ భ
‿।‿ర॥।న‿॥ భ‿॥ భ‿।‿ర।‿వగణము ఇది ౩౫౫౬౬౯॥

అందు - నంబురుహావృత్తము...చారుతమాలదళాసితవర్ణునిఁ*జక్రకహస్తున
నాతను । ద్వారితకంసముఖక్షితిపాలకు * నందనందనునవ్యయుఁ।
సూరకులోద్భవుఁగైటభభేదిని* జోలిచేసినుతింపభా । భారసవంబు
[illegible]

U ॥భU॥భU|Uర॥Uస|U వగము పదుమూఁటయతి. ఇది ౩౭౨౧౫౦ వది॥

అందు-ఖచగప్లుతము...యమునలోఁజొరనోడిననానా * ప్రాకృతజంతువులంబ్రబమోద। మునఁబ్రోచుటకై కలఁచంగా*దర్పమునంజను దెంచి ఘోర । ముగఁజుట్టినకాళియుసంహా * రంబొనరించినకృష్ణయ।ర్యమవిరామముతోడసభామ్ను * స్వల్వెలయుఁ ఖచరప్లుతఁ.
॥ । నU ॥ భU॥భUUUమ॥Uస॥Uస|Uవగ పంద్రెండింటయతి. ఇది౩౭౩౧౭౫వది

అందు - ప్రభాకలిత... వళిపదమూఁడవయక్కరంబుగ * వాసికెక్కనజాభరే । ఫలుసలగంబులమర్చిసొంపొద*వంబ్రభాకలితాఖ్యమై।చెలువగువృత్తమునంమసత్కవి* శేఖరుల్వినుతింతురా। జలనిధిమీఁదను బవ్వళించిన*జాంబవత్యధిపాలునిఁ ॥। నU |జ|U | జU ॥ భU|Uర॥Uస|Uవగము ఇది ౩౮౭౫౦౩ వది॥

వ॥ ఏకవింశతిచ్ఛందంబగు ప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క యక్షరంబులై ౨౦౯౭౧౫౨ వృత్తంబులుపుట్టినందు॥

చంపకమాల...చపలమనీమతోడ నొక*సంయమివేమొఱవెట్టుచుండఁగాఁ। గృపనుదదీయపుత్త్రు బ్రతి*కించినమేటివిభుండవంచునిఁ ।సపరిగణంబుతోనజభ*జాజలురేఫయుఁగూర్చిసత్కవుల్ ।త్రిపురవిభేదనాఖ్యవిర*తిందగఁజంపకమాలఁగొల్తురా॥న|U|జU॥భ|U|జ|U|జ|U| జU|Uర ఇది ౮౮౯౮౫౫ వది. పదునొకంటయతి ॥

అందు -వనమంజరి...మనువిరతుల్న జజాజభరల్వన*మంజరిం గవిశేఖరుల్ దనరఁగనాజయుఁడున్విజయుండను * ద్వారపాలకులిర్వురు।న్సనకునిశాపముఁదాఁకినిశాటుల * నంగఁబుట్టినుపర్వులఁ । జెనకినవాంఁడ్రనుజంపినకోలన్ఋ*సింహునినివ్వినుతింతురా ॥। స|U| జ|U|జ|U|జ|U|జU॥ భU |Uర ఇది ౭౫౮౭౫౩ వది పదునాలుగింటయతి॥

అందు - లాటీవిటము...సగణంబులునాల్గిటమత్యలవి * శ్వభ్రాంతిన్లాటీవి

టవృత్తం।బగునంచుఁగవీంద్రులుగొల్తురుస*మ్యక్ప్రీతిన్యాచించియ
థేచ్ఛం।దగునేర్పుసమూఁడుపదంబులుగాఁ*త్రైలోక్యంబుల్గొల్వఁగ
శూరుల్ । వ్రేగలంబలిదానవుఁద్రొక్కినయా*పొట్టిందిట్టన్వామనుఁ
గృష్ణుఁ ॥∪∪స॥∪∪స॥∪∪స॥∪∪స∪∪∪∪∪∪మ∪∪∪∪।త।∪∪
య. ఇది ౯౦౦౦౦ వది. పదమూఁటయతి ॥

అందు-మణిమాల ... అజహాత్పయోదధిఘృతంబు * లమ్ముచుమురారిఁబా
డిరెలమిఁ । నజగాఁదదీయచరణాత్త * నవ్యహృదయారవిందల
గుచు । న్వ్రజసుందరీజనములొక్క * నాఁడుమణిమాలయందుఁ
బొసఁగ । న్సజము ల్త్రివారముసముంచి * నాకవిరమంబుపొందుద
నరఁ ॥∪∪స।∪∪।జ॥∪∪స।∪∪।జ॥∪∪స।∪∪।జ॥∪∪స ఇది
౯౬౫౩౫౬ వది. పదునొకొంటయతి ॥

అందుఁగరిబృంహితము..మూఁడుభనములుశేషమునుబదు*మూఁటవిరతి
యుసొంపుగాఁ । గూడుకొనఁగరిబృంహితమునమ* కూర్చివసుమతి
మండలాపీడమనుకరిబృంహితరవము * బెల్లుగఁబలుకుచుండఁగాఁ
గోడిగపుచిననాఁడుశకటునిఁ*గూల్చినహరినుతించెదఁ ∪॥భ॥
న∪॥భ॥న∪॥భ॥న∪।∪ర. ఇది ౭౮౨౩౭౧ వది ॥

అదు-కనకలత...జవమునభగభగయనుచువ్రజ * జనములఁబొదవినం । డ
పశిఖినుడిపినమధుమురి * నరకదమనయనిపేలవముగఁబలుమఱుని
రువది * లఘువులుగమునదమూఁ । డవయెడవిరతిఁబొసఁగినబెడ
గడరుఁగనకలతఁ ॥।న॥।న॥।న॥।న॥।న॥।న॥∪సఇది౧౦౪౮౫౭౬వది

వ॥ ద్వావింశచ్ఛందంబగు నాకృతియందుఁ బ్రతిపాదంబునకిరువదిరెం
డేసియక్షరంబులై ౪౧౯౪౩౦౪వృత్తములుపుట్టె॥

అందు-మహాస్రగ్ధర* స్తతనస్రాగల్వీరించా*ష్టవిరతులుమహా*స్రగ్ధరంజెప్ప
నొప్పుఁ । గ్రతువిఘ్నుంబావహిల్లం*బ్రమదమునవ్రజ*వ్రాతదత్తా
న్నమెల్లఁ । క్షితిభృద్రూపంబునన్మ్రొక్కినసుమనమరా*గ్రేసరుండం
పద్మబ్బుల్ । ధృతిమైఁజాల్వానగుర్వం*దివిరికరుణతో*ధేనువర్థాద్రి
మోఁచెఁ ॥∪స∪∪।త∪∪।త।॥న॥∪స∪।∪ర

U|UగU గ ఇది ౬౦౫౭౦ వది. తొమ్మిదింట యెనిమిదింట యతులు ॥

అందు-భద్రకము... భంబురనత్రయంబుగము నొంది* భానుయతిభద్రకం బుదనరున్ । బంబిసపిల్లగోలకరయుగ్మ*పాదములఁబట్టియూఁదిపశువ । ర్గంబునరణ్యమధ్యమధరిత్రిఁ * గాచుసమయంబునన్యమునతీ । రంబునగొల్లలంగలసియోగి * రంబుదినెఁ గృష్ణుఁడంచుఁబలుకన్ U॥భ।U।ర॥న U।U ర॥ న U।U ర ॥ నUగ ఇది ౧౦౩౩౫ ౧౦ వది*పండ్రెండింటయతి॥

అందు-మానిని... రాజలుసప్తభముల్గమువిశ్వవి*రామమమానినియందు భర। ద్వాజముఖప్రముసీశ్వరులందఱు* దైత్యగురుభృగువాక్యము నన్ । రాజలనాయకతల్పునిదైవత* రాజనజస్రముగొల్తురువి । భ్రాజితమోక్షముచేకుఱుఁబుణ్యధ * రాస్థలినం చువచించుట చేన్ U॥భU॥ భU॥భU॥ భU॥భU॥భU॥భU గ ఇది ౧౫ ౭౫౨౨ వది. పదుమూఁటయతి ॥

అందు-విచికిలిత... ప్రవిలయసమయమునసుబద*పడిజలనిధినడుమన। ద్భువనములుకడుపునని*పుక*భుజగపతిశయనము పై । నవిరళమతిఁగురు కువరదుఁ*డనివిచికిలితఁబదుమూఁ।డవయెడవడియిరువదియొక * లఘువుగముబలుకనగున్ ॥। న ॥న ॥న ॥న ॥ న॥ న ॥ నUగ ౨౦౭౦౫౧ వది ॥

అందు-తురగము.. .ననననసజజగలుతిథివిరమ*ణంబగుస్తురగంబునన్ । గనలు చునగరముపయివిడిసిన * గాంచితానొకరుండెదు రొ్క్క । నిదవులకుఁ గొనిచనిగిరిగుహఁ *గూర్కునాముచికుందుచే । తనుయవనునిఁబొరి గొనితనివసు*ధస్థలింతురుగభూసురుల్ ॥న॥న॥న॥న॥UసU।జ ।U।జUగ ఇది ౩౧౭౯౯౯౭౭ వది పదేనింటయతి॥

అందు-మద్రకము... అధ్వమునందు సద్ధమయివా*హనాకృతినున్న బకాసురుమహా । సాధ్వసమన్వితజార్భకవినా*శనక్షమువక్త్రముఁజొచ్చిసురలున్ । బాధ్వగులై నుతింపఁగఁదదీ*యదేహము వెళ్లినఁగృష్ణునుతిన। త్రధ్వజమద్వితామముభర * స్రసాసగలుందగుమద్రకమునన్

వ॥ చతుర్వింశతిచ్ఛందంబగు సంకృతియందుఁ బ్రతిపాదంబునకునిరువది నాలుగేసియక్షరంబులై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టెనందు॥

సరసిజము...సంబంధించున్నత్యాలునానా*సలుదశనిధియతి*సరసిజమునకుఁ గంబూరస్వ్రందాటవిలోనం* గవిసిక్రొనినసుర* కరువలిదనుజుఁ । శంబాభీలంబైతగుముష్టిం * జదిపిసయదుపతి * స్తవములునసురా। గంబూరన్బాభిల్లఁగఁ బాంచ*త్క విపటులభినుతిఁ*గ అపుడురవనిఁ ◡◡◡మ◡◡।త।◡◡య॥న॥న॥న॥న॥◡స. ఇది ౭౩౭౮ ౧౪౪ వది పదింటతొమ్మిదింటయతులు॥

అందు-క్రౌంచపదము...పంచమకేశుండిచ్చినభాస్వ*ద్వరమునమనమున* బవరముగోరన్ । వంచనతోబాణాసురుహ స్త*వ్రజములుదరిగెను* వడిహరియంచు।న్బాంచితలీలన్శంకరనంది*ప్రకటితవిరతులు*భమ సభనాన్యల్ । క్రౌంచపదీవృత్తమ్మునఁజెన్నా *రఁగఁబలుకుదురిలఁ * గవివరులెల్లన్ ◡॥భ◡◡◡మ॥◡స◡॥భ॥న॥న॥న।◡◡ య ఇది ౪౧౯౩౪౭౮ వది పదునొకంటఁదొమ్మిదింటయతులు॥

అందు-తన్వియనువృత్తము...దూడలతోఁగాపరులనుగుహాలో * దొంగిలి దాఁచినవిధినదలింపఁ ।గూడుకతద్రూపములయిపనులుం * గోపవ ధూటులుమురిపమునొందఁ ।బాడిపినోదంబులుసలిపినగో*పాలుడ టంచునుభతనసభాన్యల్ ।దాడిగొనన్విశ్వవిరమణముతో * దన్విని జెప్పఁగఁదనరుఁగవీంద్రుల్ ◡॥భ◡◡।త॥ న॥◡స◡॥ భ◡॥ భ।న।◡◡య ఇది ౨౦౭౭౬౬౬ వది పదుమూఁటయతి ॥

అందష్టమూర్తి...శ్రీకృష్ణుంగనకవస్త్రుం*జితతృణావర్తదైత్యు*న్సితకుశేశయనాభుఁ । వైకుంఠున్వరదుబృందావనచరున్వాసుదేవు * న్వసుమయుంబరముంబ । ద్మాకాంతున్నిధినిధానా * మలవిరామంబులొప్ప*న్మనతసర్భజయుంబుల్ ।సోఁకంజెప్పుదురువిద్వాం * సులిలనష్టమూర్తి*న్ప్రతిభుల్గృతచర్యల్ ◡◡◡మ॥న◡◡।త ◡స◡।◡ర◡॥ భ।◡ జ।◡◡య ఇది ౩౬౧౪౫౨౦ వఁ తొమ్మిదింటఁ దొమ్మిదింటయతులు॥

వ॥ పంచవింశతిచ్ఛందంబగునతికృతియందుఁ బ్రతిపాదంబునకునిరువది యైదేసియక్షరంబులై ౩౩౫౫౪౪౩౨ వృత్తంబుపుట్టినందు॥

బంధురవృత్తము...సారిదిసననననసభభభగములతోఁ* షోడశసంఖ్యవిరామముతోఁ। బరువడిదినదినమునబుధజనులీ*బంధురవృత్తమునందును
తిం। తురుహిమకరకుసుమము నొసటనుగ*న్నన్నణిపాగయుఁ దాల్చి
నయా।దారజములనడుమనిలిచిన తెలుపుం*దూకొనుప్రవంతకుఁదండ్రి.
యనన్॥స॥న॥న॥స॥Uస U॥భU॥భU॥భUగ ఇది ౨౮౭౩౪
౨౩౫ వది॥

అందు-భాస్కరవిలసితము...చెల్లెలివిజయునకిచ్చినవానిం*జేరెడుపృథుకము
లుదినినవానిన్।గొల్లతలనువలపించినవానిం* గొల్లకుఁగొడుకనఁబ
రిగినవానిన్। మల్లురరణముసఁజంపినవాని*న్భజయభననసగలుపదు
మూటన్।బల్లిదమగువిరమంబుదలిర్ప*న్భాస్కరవిలసితములుగాని
యాడున్U॥భ॥। స।U।జ।UUయU॥ భ॥। స॥। స॥ Uస Uగ
ఇది ౮౩౮౧౩౧౧ వది॥

అందు-ధరణిధరగతి. .వసునములుగము*వసువసుయతులు*వలసగుధరణిధ
రగతిన్।గసరొదవినుడి* కరువలిపగిది*గదసియమశిశుచయముతో।
మసలెకనెడమురి*మథననినుఁగొని*మదినలగుచునెగసియా!కసము
నకెగయుఁ*గశకటదనుజు*శమగలిపితివనిపలుకన్ ॥స॥స ॥న॥న
॥న ॥న ॥స ॥న U గ ఇది ౧౬౭౭౭౨౧౫ వది మొనిమిదింట
నెనిమిదింటయతులు ॥

వ॥ షడ్వింశతిచ్ఛందంబగు నుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదాఱేసి యక్షరంబులై ౬౭౧౦౮౮౬౪ వృత్తంబులుపుట్టినందు॥

భుజంగవిజృంభితము...ప్రాలుప్రనత్నేశానప్రాంతు*ల్వహిమమతననసరన*
వల్ భుజంగవిజృంభితన్। గాళిందీమోపం బెండ్లాడ*న్ఘరదనుజుఁడుని
మొనుశి*ఖావలాంచితపింఛముఁన్। మాళిందాల్చెన్నండింద్రో చెన్మఁజి
దికిరథముఁగడపె*మద్దిచెట్టుల్గూలిచెన్। దాలంబుల్గూల్చెన్వేగన్మ*
గ్ధలుప్రభమయుఁగనుమురళిఁ* దాలిచెన్నువిభుండనన్ UUUమ
UUUమUUU।త ॥న ॥న ॥న U।U ర॥U స।U వగణము
తొమ్మిదింటఁ బదునొకంటయతులు ఇది ౨౩౨౫౪౮౪౦ వది ॥

వరాహావృత్తము...రాజిల్లున్దశకుధరవి*రతులుమగణ * రననగగలువరా
హాఖ్యన్ ।జేజేలందఁగనుపొగడను*చిత్తుఁడవితలఁ*చిభృగువుపలుకఁగని
త్యంబున్ ।తేజశ్శ్రీపెరుగఁగమది*దృఢమగనిడి*తిమురుచుఁగొలిచిరి
దాశార్హున్ । రాజీవాక్షునిసరహరి * రవికులవరు * రఘుపతిబలస
హాజుంగృష్ణున్ ‿‿‿మ॥న॥న॥న॥న॥న॥న॥ ‿స
‿‿గగ ఇది ౮౩౮౮౧౨౨ వది పదింటనేడింట యతులు॥

మంగళమహాశ్రీయనువృత్తము...పొత్తు లెడఁబాయుటను* బోరుసమయం
బునను*బొంగుచు।గురూఢ్యహులనెల్లన్ ।దుత్తుమురు సేయఁగగు*దు
ర్భునుమనీపనది*నుప్తసమరావనిఁగిరీటి।కృత్తకుభజన్నభజ*సనగలు
మన్యాజుల * శ్రాంతులనుమంగళమహాశ్రీ। వృత్తములఁజెన్నలర*
నిచ్చిరిసువాసినులు* నింపడరమంగళమహాతుల్ ‿॥భ॥‿।
జ॥‿స॥న‿॥భ। ‿।జ॥‿ స॥ న‿‿ గగము తొమ్మి
దింటతొమ్మిదింటయతులు ఇది ౧౫౭౮౮౧౩౪ వది॥

క॥ పొందుగనిటువదియాఱగు।ఛందములందుదయమైన* సమవృత్తము
లానందమునంగవులుపొగడెడు।కందువలవచించినాఁడఁ*గామెపలీశా॥వ॥ఇ
విసమవృత్తలక్షణంబులింకముఖ్యగౌణవృత్తలక్షణంబులెఱింగించెద.

## ముఖ్యగౌణవృత్తలక్షణము.

సీ॥సమవృత్తపఙ్క్తి-స్వస్థానార్ధసమములుస్వస్థానవిషమాఖ్యఁ*జనునవి
యును।పృథివిపైసమవృత్త*భేదంబులీమూఁటికక్షరంబులునమం* బన్నికా
శ్ల।నివివృత్తముఖ్యంబు* లిఁకఁబరస్థానార్ధసమవృత్తములుపర * స్థానవిష
మసంజ్ఞలఁబద్యము * ల్సర్వపరస్థానవిషమంబులునునివి * విషమవృత్త।భేద
ములువీనినాలుగు*పాదములను।సమముగాఁజూపడవువర్ణ *సంఖ్యలెచ్చు।కడ
మలైయుండునీమూఁటి*గౌణవృత్త।పద్యములసంద్రపుశ్రీకామె*పల్లినిలయ॥

## సమవృత్తవివేకము.

గీ॥జగతిసమవృత్తమెన్నవ*ఛందమునననుసంభవము నొందెనన్నియు*క్షర
ములమరుఁ।బదపదంబున హెచ్చును * గొదువగాఁగ । ప్రాసములువిరామం
బులఁ * బరిఢవింప॥ ౨౬౬॥

## స్వస్థానార్ధసమవివేకము.

ఆ॥ అక్షరములుసమము*లయ్యెస్వస్థానార్ధ। సమములందునాల్గు* చరణములను। విషమపదములొక్క*విధముగణంబులు। సమపదంబులొక్క* పరిగణములు ॥ ౨౬౭ ॥ క॥ సగమొక్కవిధంబునఁబెఱ। సగమొక్కతెఱంగు గాఁగ * సమకూర్పఁదగున్। జగతి నొకకాలొకకరణి। నొగిమూఁడు పదంబులొక్కయోజం దనరున్॥ ౨౬౮॥ తే॥ సాధుకవికృతగ్రంథసం * జాతమెల్ల। వెదకిసకలోపజాతుల * విచ్చలవిడిఁ। గాళిదాసుఁడు రఘువంశ* కావ్యమునను। జెలగిరెండవసర్గలోఁ * జెప్పినాఁడు॥ ౨౬౯ ॥ వ ॥ అట్లుగాస్వస్థానార్ధ సమవృత్తంబులందు నుపజాతియను వృత్తము ॥ ఉపజాతివృత్తము ॥ ఈపాటితోఁ జేసుల * లింద్రవజ్రం। బుపేంద్రవజ్రాహ్వయ*మూర్విసల్కం। దాపించినం తంగను * గానముద్రా। జపిష్ఠలోలాయుప * జాతియయ్యెన్ ॥ ౨౭౦॥ ఇదిపదునొకండవత్రిష్టుప్ఛందంబునందలియింద్రవజ్రాఛాయను జేసి పాదములును నుపేంద్రవజ్రాఛాయను సరిపాదములునునడుచును మఱి యు స మోపజాతి * తాపింఛనీలాంగుఁబ్ర * దాకుతల్పున్। గోపాలబాలు న్రవి * కోటితేజున్। కృపాసముద్రున్నుతి * యించెదన్నౌ। క్త్యుపాధిగాంతిం చిన * మోపజాతిన్॥ వ॥ ఇంద్రవజ్రాఛాయను మొదలి రెండుపాదములను నుపేంద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములనునడుచును॥ ౨౭౧॥ మఱి యు వ్యత్యస్తస * మోపజాతి * తపంబుచేగోల్తు * ధాత్రుతాతన్। గపాలికో దండవి * ఖండనాఖ్యున్। గోపీభుజంగున్ధృత * గోత్రుసన్మో। క్షోపాయు వ్యత్యస్తస * మోపజాతిన్॥ వ ॥ ఇది యుపేంద్రవజ్రాఛాయను మొదలిరెం డుపాదములను నింద్రవజ్రాఛాయను గడమరెండుపాదములనునడుచును. మఱియు వైపరీత్యోపజాతి * తాజల్లగంబొంటజ * తజ్జగంబుల్। గజిక్కన మ్మ్రోఁటను * గంతువేయున్। వ్రజాంగనావల్లభ * వైపరీత్యో। పజాతివృత్తం బున * భంజెలంగున్ ॥ వ॥ ఇది యింద్రవజ్రాఛాయను మొదలిచరణమున నుపేంద్రవజ్రాఛాయను గడమ మూఁడుచరణములనునడుచును*దీనిపేరేవా రాంగిని * మఱియు నీవృత్తమునసేయింద్రవజ్రాఛాయనైదైన నొకచరణ మునునుపేంద్రవజ్రాఛాయనుగడమ మూఁడుచరణములును జెప్పినను దప్పు లేదు॥ మఱియునుపచిత్ర * భిదురంచినసావలు * బేసులన్। గాదిలిభాభగ * గంబులుసర్లన్। గుదుర్రై రసికస్తుతిఁ * గూడినన్। శ్రీదయితాయుప * చిత్రిచ

లంగుఁ॥ వ॥ ఇదిత్రిష్టుప్ఛందమునందలివృత్తచ్ఛాయనుబేసిపాదములను దోదకవృత్తచ్ఛాయనుసరిపాదములను నడుచును॥ మఱియు నారీనుతము॥ పేరెంబుల్వారోరి * బేసిన్మతాగా । సారంబుసర్ల్గదత * జల్గగంబుల్ । ధీరోదాత్తుల్ సన్ను * తింపఁ ధరిత్రిఁ । నారీనుతంబయ్యెజ * నార్ధనాఖ్యుఁ ॥ వ॥ ఇదిపనుకొంటఁద్రిష్టుప్ఛందస్సునందలిశాలినీవృత్తచ్ఛాయనుబేసి పాదములనునింద్రవజ్రాఛాయనుసరిపాదములను నడుచును॥ ౨౨౩॥ మఱియును నజితప్రతాపమనువృత్తము ॥ జలజాక్షుబేసులస*జల్ సనలుఁ । బలుమఱుఁ సరిస * భజ్రజలొందఁగా । జలజోద్భవాబజవి* శాలయతుల్ । దళములై నయుజ*తప్రతాపమౌ॥ వ॥ ఇది సంద్రెండవజగతీచ్ఛందస్సునందలిప్రమితాక్షరవృత్తఛాయనుసరిపాదములను బ్రియంవదావృత్తచ్ఛాయను బేసిపాదములనునడుచును॥ మఱియురతిప్రియము॥ బేసిన్మసరగలు* పేర్చిసర్లజంబుఁ । భసల్సలుంగదసిన* పాదబద్ధమై । యూసామోద్భవచతు * రాస్యవిశ్రమఖ్యాతిసన్నుతింపఁదగురతి*ప్రియంబనఁ॥ వ॥ ఇది పదుమూఁడవయతి జగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను బేసి పాదములునురుచిర వృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును॥ ౨౨౬॥ ఇది స్వస్థానార్ధసమ వృత్తలక్షణం బింక స్వస్థానవిషమవృత్తంబులెట్టివనిన॥

## స్వస్థానవిషమవృత్తవివేకము.

ఆ॥ చరణములనువర్ణ*సంజ్ఞలుదప్పక । నాల్గుపాదములగ*ణములునాల్గు। విధములై చెలంగు*వృత్తముల్ స్వస్థాన । విషమవృత్తసంఖ్య* వెలయుచుండు॥ అందుధరణియనువృత్తము॥ రసస్సై సచతుష్కము*రారసలుఁ । నానసల్ మాససల్ * నాటినన్మణితా । పసనగరస * పరిపక్వయుతు । లాసోంపారున్నా*లాయముగాధరణుల్॥ ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమునను గడమమూఁడుచరణములను గవికల్పితములై నడుచును॥ మఱియునువారాంగి॥ తాజల్గయుగ్మంబుజ * తజ్జగంబుల్ । తజాగగంబుల్ మభ * తల్లగంబుల్ । రాజిల్లునిభేంద్రవి * రామయుక్తిఁ । వాజిగ్రీవాహారి* వారాంగిదగుఁ॥ ఇదియింద్రవజ్రాఛాయను మొదటిచరణమునను పేంద్రవజ్రాచ్ఛాయను రెండవచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయనునాలవచరణ

మునసునడుచును॥ మఱియునంగజాస్త్రము ॥ రంగుభమస్గల్ * గ్రాలుమసజ్గల్ । పొంగైమన్యగ*ముగ్రజర్గలో । ప్పంగానార్త*వగిరివల్లైతే । నంగజాస్త్రివృత్త * మందగించుౘ॥ ఇది రుగ్మవతీచ్ఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయనుమూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాలవచరణమునసునడుచును॥ మఱియునదీప్రఘోషము ॥ పోలిమైరారరం * బుల్ జతగ్రజంబులుౘ । తలంచఁగాయాయయులుౘ । దతగ్రజలుౘ*విలాసాచలాష్టభవిశ్రాంతితోడౘ । దేలింపనొప్పారునదీప్రఘోషముల్ ॥ వ ॥ స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాత వృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును॥ ౨౭౧ ॥ వ॥ ఇది స్వస్థానార్ధ సమవృత్తవివేకంబు ॥

ఇంకఁ బరస్థానార్ధసమవృత్తంబెఱింగించెద ॥ పరస్థానార్ధసమవృత్తవివేకము॥క॥మూనుగసమాంఘ్రులొకగతిఁ। బూనికవిషమాంఘ్రులొక్క*పోలికలిప్పులై ।హీనాధిక్యములుపరస్థానార్ధసమంబులందు*సమవిషమములౘ॥ ౨౭౨॥ అంపమమనోహరవృత్తము॥ పేరై సతజజ్వలు* బేసియెడౘ।సరులౘసచతుష్కము*సాగినగం।భీరేభపితామహ * విశ్రమముల్।పెరుగంగమనోహర*వృత్తముతా॥వ॥ఇదికవితాంతవృత్తవృత్తచ్ఛాయనుబేసిచరణములను దోటకవృత్తచ్ఛాయనుసరిచరణములనునడుచును॥మఱియుఁగేతుమతి॥జతబేసులన్స*జనగముల్।భాతిసరిౘభరే*షనగగంబుల్ । యతిశైలసంఖ్య*నమరఁగా ।నాతతకేతుమ * త్యభిధమొప్పౘ॥ ౨౭౪॥మఱియువేగవతి॥ సగణత్రయగ * ల్చనుబేసిౘ । బాగుగసర్లను * భత్రిగగంబుల్ । నగవిశ్రమమం * దము నొందుౘ।వేగవతీనుత * వృత్తమునందుౘ ॥ అందువియోగిని ॥ ససజల్ గము*సాగబేసులౘ । బసనభ్రిల్గము * భాసిలుౘసరిౘ । రసశైలవి * రామసంగతిౘ । బొసఁగున్యోగిని* భూరమాధిపా ॥ ౨౭౬ ॥ మఱియుఁబరావతి॥ ఓలిరగ్రజజాంతగంబు*లుంచిబేసులం । మలౘజరగ్రజగంబులు * న్గదిరింపఁగాఁ । గ్రాలుచున్నిధానదిగ్వి * శ్రామమొప్పఁగా । నిలంబరావతీసువృత్త*మింపుగాంచుౘ ॥ ౨౭౭ ॥ మఱియుధృతమధ్య ॥ బారిగబేసుల * భాభ

గగంబుల్ । సగులనజాయలు*సాగఁగమేల । య్యాగెశిలోచ్చయ* హస్తివి
రావమో । దారతయొప్పను*చాధృతమధ్యల్॥౨౭౮॥ వ॥ఇదితోదకవృత్త
చ్ఛాయనుబేసిచరణములను దోదకవృత్తచ్ఛాయను సరిచరణములనునడు
చును ॥ వ ॥ ఇది పరస్థానార్ధసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవి
వేకం బెఱింగించెద॥

పరస్థానవిషమవృత్తవివేకము.

క ॥ దానవహర యొకచరణం । బైనను రెండడుగులైన * నక్షరగణసం।
ధానములను బెఱతెఱవగు । వీనికిఁ బేరుపరదేశ*విషమములయ్యెన్॥ ౨౮౦॥
అంకుశరభద్రీడ ॥ ఘనాదిత్యక్రాంతిన్యమనసరగ * గల్మ్యాడుకాల్గెల్ । గన
ద్ధామక్రాంతి స్తభనయజ* గద్వంద్వమొందన్ ॥ దనర్పంగాఁబౌరాణికకథ
ల*దాశార్హుఁప్రాక్రు । వ్వనర్ధం బెచెన్నా రవనిశర * భద్రీడసంజ్ఞన్॥ వ ॥
ఇదిచంద్రశ్రీఛాయనుప్రథమచరణమునను విశాలచ్ఛాయనుమూఁడుచరణ
ములనునడుచును ॥ ౨౮౧ ॥ మఱియు శ్రీరమణము॥ఆదిభమస్ల * ల్లాత్తిన
న్నాపై । గాదిలిభాభగ * గంబులుమూఁటన్ । బాదుకొనంగవి * పల్కెన
చోల । శ్రీదయితాధర * శ్రీరమణంబౌ ॥ వ ॥ ఇదిరుగ్మవతీఛాయనుదో
లిచరణమునను* దోదకచ్ఛాయనుమూఁడుచరణములనునడుచును ॥ మఱి
యురథగమనమనోహరంబు* గ్రథితనయుగరల్ల * గంబులుంబొసంగ॥ ప్ర
థమతృతీయచతుర్థ * పాదములన్వచింపన్ । విధిదశయతులొందె*వింతగాన
జార్యల్ । రథగమనమనోహ * రంబగున్ధరిత్రిన్॥ వ ॥ ఇదిపరస్థానవిష
మవృత్తవివేకంబింక సర్వపరస్థానవిషమవృత్తవివేకం బెట్టిదనిన ॥

సర్వపరస్థానవిషమవృత్తవివేకము.

క॥ ఉర్వినాలుగుపదములఁబర్వినగణములనువర్ణ*బద్ధిగణనయున్ ।
సర్వమువిపరీతంబగు । సర్వపరస్థానవిషమ * సంజ్ఞలనుహరీ ॥ ౨౮౩ ॥ అం
దువీణారచనము ॥ దారిందయసాలగ్మతి * తజ్జభగాలు । న్నారించితజన్భ
సలుభ*నాజనగంబుల్ । జేరన్మణిదిగ్దశశశి * శేఖరవళిపీ । ణారచనధరఁజెలఁ
గును*నారదవినుతా ॥ మఱియునుద్ధతము ॥ అరుదారను * ద్ధతమయ్యె ।
న్మగిసజయులున్ * ససజ్జలున్ । జారుభనజవలు*సజ్జలున్ । ధరపణ్మహీంధ్రా
గజ * ధాత్ర్యయతిన్ ॥ ౨౮౪

వ॥ ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమునను అపరాజితచ్ఛాయను రెండవచరణమునను మాలినీచ్ఛాయను మూఁడవచరణమునను నడుచునునాలవచరణము కవికల్పితము॥ మణిదీపిక॥ గురుపితామహాముఖ్యులఁగినిసిఘోరరణములలోఁ। దెరలిచెనఁగుఁడనిపలుక రత్న* దీపికల్లనరునన। క్షరనభభ్న భసల్ననాసజ* కారభసలునభర్సనసనసలు। స్భరసజాగలుభూపతుల్విన* భానువిశ్రమయుక్తితోఁ॥ ఉ॥ ఈసమవృత్తరాజినుద* యించివిరామము లున్గణంబులుం। బ్రాసములెల్లఁదప్పకనమర్చివచించినవైదుశ్రోవలై। భాసిలువృత్తపద్యముల*పారములై విషమాహ్వయంబులై। వాసికినెక్కుశిష్టజనపాలనదుష్టనిశాటచాలనా॥ ౨౯౯॥ వ॥ ఇదిపంచవిధస్భృత్తవివేకంబింకవైతాళీయజాతివృత్తంబులెఱింగించెద॥ మ॥ ప్రకటింతున్ధరదక్షిణాంతికయునౌ* పచ్ఛాందసంబుంబ్రవ। ర్తకయాపాతలికాపరాంతికలువై * తాళీయమున్జారుహా। సికప్రాచ్యంబునుదీచ్యవృత్తియనఁగాఁ* జెల్వొందువృత్తంబులిం। దుకులశ్రేష్ఠయనేకముల్గలుగునం* దుంగొన్నివాక్రుచ్చెదన్॥ కం॥ ఖ్యాతిగనురగడలందును। వైతాలీయాఖ్యవృత్త*వారములందున్। బీతాంబరగురువునకు। నీతిగఁగృతులన్లఘువులు* రెండేసియగున్॥ ౩౦౦॥ అందు దక్షిణాంతిక॥ ఉరుసాజగ* లుండుబేసులన్। సరులందూకొను* సభ్రీవంబులున్। దొరలేడిటఁ* దొమ్మిదింటరా। ధరలోఁజెన్నగు* దక్షిణాంతికల్॥ ఔపచ్ఛాందసము*ఇమిడిసలము* లేడుతొమ్మిదింటన్। సమకూఱున్యతి*మద్ల రేఫయంబుల్। సమతన్వసుల*హ రేభయంబుల్। క్షమలోనౌప* చ్ఛాందసంబుమించున్॥ ౩౦౧

ప్రవర్తక॥ స్థిరబేసిను* దీచ్యవృత్తియున్। బరగున్సర్లను* బ్రాచ్యవృత్తియున్। గిరిమణియతి*కీలితంబుగన్। బరముఁగొల్వఁ*బ్రవర్తకాఖ్యమా॥ ౩౦౨॥ ఆపాతలిక॥ లములాఱునలున్భగగంబుల్। లముతెనిమిదిటికడన్భగగంబుల్। క్షమగిరినవ*శాంతులుందగున్। బ్రమథితమురయా* పాతలికాఖ్యల్॥ పరాంతిక॥ ఇలవర్తక* వృత్తరీతితోఁ। దులమైపాదచ*తుష్టయంబులన్। బలసినయది* పద్మనాభచె। న్నలుగుంగృతులఁబ* ---తికాఖ్యచేన్॥ ౩౦౩॥ వైతాలీయవృత్తము॥ ఋతులఘువు ॥* ౦బులున్। ధృతవసులఘువులు* రేఫవంబుల్। జతసమకొన*సా

రసాత్మపా। లితశుకవైతా * లీయవృత్తమా॥ చారుహాసిక ॥ ప్రథమము నను * వర్తకాఖ్యవృ। త్తముచందంబుప * ధాత్రిసత్కవుల్।సమకూర్చి* శార్ఙ్గకార్ముకా। సమతస్మిఱును * చారుహాసికల్॥౩౦౪॥ప్రాచ్యవృత్తి* తొలి నేఁడిటఁ * దొమ్మిదింటఁ బ్రశాం।తులుపదునాలుగు * దూఱుబేసులం।దులఁ బడాఱు * తొంగలించుస। ల్లలిన్మాధవ * ప్రాచ్యవృత్తియా॥ ఉదీచ్య వృత్తి॥ తమకిరవగు * దక్షిణాంతికా। ఖ్యము తేజంబున * నందగించుమే।లిమి కృతులక * డిందివెలుపా। తిమురుద్ధాత్రిను*దీచ్యవృత్తికల్॥వ॥ ఇదివైతాలీయజాతివృత్తవివేకంబింక మాలికావృత్తంబు లెఱింగించెద॥

## మాలికావృత్తవివేకము.

తే॥ మాలికావృత్తములనంగ*మఱియునైదు।దనరునిరువదియాఱుఛందములమించి। యలలయగ్రాహిలయవిభా*తిలయహారి।గదసహజత్రిభంగియుదండ*కంబులనఁగ॥౩౦౫॥క॥ ముప్పదితొమ్మిదిమాత్రలముప్పదియక్క రలపద*ములయంఘ్రులనా। ల్గొప్పయతిప్రాసంబులు। గుప్పలయగ్రాహియనఁగఁ * గొమరొందుహరీ॥ లయగ్రాహి॥ ఇంపడరఁగాభజస * నంబులతుదన్భజస*నంబులపదంపడిభ*యంబులులయగ్రా। హింబరగుప్రాస విర*మంబునలుమాఱుగుడు*రంబటుకవీశులుతి * రంబుగవచింపఁ। నంబరముగావలసి*తొంబగలిదానవక*దంబముసహాయముగఁ*బంపిత్రిదశుల్దు। గ్ధాంబునిధిద్రచ్చియమృ * తంబుగొనఁజాలుసమ *యంబుదొరకించితిము* దంబునముకుందా॥ ౩౦౬

క॥ ముప్పదితొమ్మిదిమాత్రల।ముప్పదినాల్గులిఖులపద*ములయంఘ్రు లునా। ల్గొప్పయతిప్రాసంబులు। గుప్పలయవిభాతియనఁగఁ* గొమరొందు హరీ॥ లయవిభాతి॥ పెనిమిటులుభార్యలును * దనయులనుగాంచిరటె* మన మలరదొడ్డతప*మునవలదశస్యం। బనుఁడుఁ మఱికోసలియుఁ * దనకడు పులోపలభు * వనములక్షలంబునిడు * కొనినకొడుకున్నా। మునినిసద్వయ ము*వెనుకననగంబులును * జొనిపితుతులుండునెడ * లనలుమఱుప్రాసం బునిలిపికవీశ్వరులు * మునులయవిభాతినిటు * నినువినుతిసేయుదురు* వన జదళనేత్రా॥ ౩౦౭॥క॥ ముప్పదితొమ్మిదిమాత్రల। ముప్పదియేడులిఖులప ద * ములయంఘ్రులునా।ల్గొప్పయతిప్రాసంబులు। గుప్పినలయహారియనఁ గఁ * గొమరొందుహరీ ॥ ౩౦౮॥ లయహారిఁ నగణములు పదునొకఁడు

సగణముసుగురువునిడి*మిగులనలుమఱియతులు*దగులులయహారిన్ ।వెగ
డిశతధృతిపరిప*రిగతులమొఱయిడిసమ * రిగిఝషతనువుఁబొదివి*నిగిడిచని
యంతన్ ।నిగమములుగొనివెసను*జగములఁద్రువఁబఱచియు*దిగికడపలిజడ
ధిము*నిఁగినభియాంతిన్ । వెగడుచునుడిసికరచి* తెగఁగొనినతురగగళుఁ*
డగుహరివనఁగనుకవు * లగణుతిచెలంగుఁన్ ॥క॥ ఇదినేత్రాంబుధిలముమ।
ప్పదినాలుగువర్ణములను * బాదంబగుఁద। త్పదచాతుర్థికములచే। నొదవుఁ
ద్రిభంగియనువృత్త * మర్వరలోన్ ॥౩౧౦॥ త్రిభంగివృత్తము॥ విసువ
కనుపలు * రసఁబ్రతిపదమున * హాసగగలుమూఁడొకతిర్రై మఱివేత్రైమూఁ
డొకతిర్రై । రనగణములు * నుసనభమసగములు పొసఁగిసమద్యుతిసంగిన్రి
ణరంగింజెల్లుఁద్రిభంగిన్ । మసలెడుద్రవజమున * దుసికిలిమధురకుఁ*గసికిస
మృద్ధశుభాంగిందగు భంగింజేరిత్రిభంగిన్ । వెసమనిచిననవ * బిసరుహన
యనఁయు*నిసభలవేఢ్కఁగురింతుఁన్ వినుతింతుఁన్ నిచ్చలుఁగాంతుఁన్ ॥ క ॥ఇది
నియమములేనిమహో। పథమునఁగానలసినంత*వక్కాణింపన్ । గొదలేకన
మరుద డక।ముదధీంద్రశయాసతావ*కోత్తమసుతులన్ ॥౩౧౧॥దండకము
॥విద్వాంసులెల్లన్ హాకారంబెకానీసకారంబెకాని సకారంబెకానీవచింపంద
గున్నుందుగానిందుగాదేనియాదిందకారంబుగల్పించియామీఁదనెల్లందకా
రంబులేమొందుగానిచ్చకున్వచ్చునందాకనిర్మించి గుర్వంతముంజేసినద్దండకం
బంద్రుభక్తానుయాయీభుజంగేంద్రశాయీపయస్త్రద్యాదికస్త్రైయినైర్మ
ల్యతాపింఛగుచ్ఛచ్ఛవిస్వచ్ఛమాయూరపింఛావచూడా సదాపూతబృందా
టవీమధ్యరథ్యా సమారాధ్యతథ్యార్భక క్రీడహేమేతుణాఖర్వదోర్గర్వసం
భూతసర్వోర్వరా భారనిర్వాహకార్థాంగితక్రోడచండ ప్రభామండితానే
కమార్తాండకోటిప్రతీకాశ నానావిధస్తోకలోకేశ వైకుంఠసంవేశఘోషాం
గనాలోలకాదంబినీ నీలగోపాలబాలా నమస్తేనమస్తేనమః॥౩౧౨॥క॥ దం
డిగనేకపదంబున। నుండెడివినినాల్గడుగుల * నుండెడివినవే। దండావనదండ
కముల। పిండువుదనరారుఁజండ * వృష్ట్యాదికముల్॥ దండకము॥ ధూర్త
ల్నకారంబులుద్రెంటిపైసప్తరేఫంబులుంగూర్చినం జండవృష్ట్యాఖ్యమయ్యో
న్నకారంబులుద్రెంటిపైసప్తరేఫంబులుంగూర్ప సశ్వాఖ్యమయ్యోన్నకారం
బులుద్రెంటిపైరత్నసంఖ్యాకరేఫంబులుంగూర్చినన్నర్ణవంబయ్యెనొలిన్న
కారంబులుద్రెంటిమీఁదందసంఖ్యాతరేఫంబులుంజెప్పినన్ వ్యాళమయ్యెన్న

కారంబులు(నెంటిపై రుద్రసంఖ్యాక రేఫంబులున్నిల్పజీమూతమయ్యెన్న కారంబులు(నెంటిపై నొప్ప పంద్రెండు రేఫంబులుంజెంది లీలాకర బయ్యె(బేర్తినన్న కారంబులు(నెంటిపైమించు పద్మా(డు రేఫంబులున్నంతనుద్దామమయ్యెన్న కారంబులు(నెంటిపైరూఢి(బద్నాలు రేఫంబులన్సంఖమన్దండకంబయ్యె నీరీతితో(డన్న కారంబులు(నెంటితర్వాత నేడాదిగా( గారకారంబులొప్పారగానంఘిరి నె కొక్కొక్క టెక్కించికా వించినంజండవృష్ట్యాది నానాలసద్దండకంబుల్విశాలించు(గాకుండెనాల్గంఘ్రిలుంజేయ(గావచ్చునీరీతినేకోనసాహస్రపర్యంతముం గూర్చియిచ్చావిధిం జెప్ప(గావచ్చు( గాంతంబుగారాధికాజార శ్రీరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథవాః కేళికాసక్తగోపీజనోత్సృష్ట వస్త్రాపహారాశుకాస్యోక్త వాక్యామృ తాంభోధిచంద్రోదయాసాంద్రదేవా నమస్తేపునస్తేనమః ॥

## జాత్యుపజాతినామములు.

క ॥ జాతులునుపజాతులునన । భూతలమున రెండగువిధ* ములవృత్తంబుల్ జాతులుకందాదులునుప।జాతులుగీతాదికములు * సరసిజనాభా॥ ౩౧౮॥ సీ॥ కందభేదములాఱు * గాకనుత్సాహంబు తరువ్యోజమధ్యమా * క్కరలునైదు*దీపించుమంజరి* ద్విపదత్రిపదచతుష్పదపంచపాదిష*ట్పదవిధములు।తొమ్మిదివిధముల * తో నొప్పరగడలుకళికలునుత్కళి*కలునుగూడ।జాతులునవవిధ * గీతంబులునుసీసపత్రకంబునునుప * జాతులయ్యె। నను చునన్నయభట్టుభీ* మనయు(బెద్ద। సచివు(డునుమూర్తితాతను * జయనసంత।మంత్రియును(దిమ్మరాజుని * మ్మాడిక్కి(జెప్పి । రందముగ(దాముచేసిన* ఛందములను॥

## జాత్యుపజాతినిరూపణము.

క॥ గురులఘువులలోనెయ్యది। మురసంహరప్రథమపాద * ముఖమున నిలుచున్ ।ధరనుపజాతులుదక్క(గ( । బరగనిలుచునవియెనాల్గు*పదముల మొదలన్ ॥ ౩౧౫॥మ॥ ధరణిన్ జాతులకాదివర్ణమొక(డే * తప్పంగరాదెల్లెడన్ । హరితజ్జాతిగణంబులైనసరియి * ట్టైన(గావచ్చుమం । దరధారీయుపజాతులంప్రథమవ * ర్ణంబున్యథేచ్ఛంబుగా । పొరిదిం జెప్ప(గవచ్చు(బ్రాసములుని * ల్చున్వళ్లకై యొక్కచోన్ ॥౩౧౬॥ క॥ తెలియ(గవినుమీకామే। ళిలినామస్గ్రామధామ * ప్రస్తుతపద్యం।బులుగీతకందసీసా।దులువిరతిగణని

యమములు * తో వివరింతుఁ ॥ ౩౧౫॥ క॥ గురులఘువుల పేరిటియక్షరము లునష్టగణనామ* కములగులిపులుఁ । సురరిపుగర్వతమోభాస్కరదీర్ఘము లైనరెండు * గానెన్నఁదగుఁ ॥౩౧౬॥

కందషట్కాభిధానంబులు.

గీ॥ పరగఁగందముపథ్యయు*మరివిపులయుఁ । జపలయును * ముఖచపల యు* జఘనచపల।యనఁగఁగందపద్యంబులీ * యాఱువిధము । లఖిలసుకవి కృతులలోన* నలరుచుండు॥ ౩౧౭॥ సీ॥ నలగగభజసగ * ణంబులేనునెకా నికందంబునకునెందు * గణముసొరదు । వీటిలోపలనొక * మూఁటిచేవడి లేనిహీనపాదముసుండు ఁ* గానఁ బడును । దనువాతదీర్ఘపా*దముపంచగ ణములఁదగుదానిమూఁడవ *గ్రతాపుసంచు । నలజలుదక్కంగఁ*గలయవా మీఁదనేయతిదాఁకునిజపదా*ద్యక్షరంబు॥ తే॥ తుదినిగానలుదక్కంగఁ*గ దియదొకటి । కొంచెపడుగులబేసుల * గొప్పకాల । నరులజగణంబుగూడ దీ*చరణయుగము। భువినిసగమయ్యెరెట్టింపఁ * బూర్ణమయ్యె ॥౩౧౮॥ వ॥ ఇదిసమస్తప్రబంధంబులందుఁజెప్పెడు సహజకందపద్యలక్షణము ॥ పథ్య॥

క॥ ధరలోఁబథ్యాకందము । హరియగునాఱనయెడనల * మాఱిటిపై। పిరతియుఁగూడఁగ మూఁటను। నెరయుఁజతుర్గణములుగము*నిలిచినచోఁ॥ ౩౧౯ ॥ విపుల॥ క్షమబేసికాలుసమపా । దములోఁజొరశబ్దమొకటి * తనరింపఁ। సమధికపథ్యాకందము।గమనికవిపులయనలరు*కందముగుఁ॥ చపల॥ సమపాదములమొదలజగ । ణముంగడయడుగునసుద్విగ * ణలఘువుపై । సమకొనుయతియాఱవయది । లమరముకుందచప * లకునమరఁ॥ ముఖచపల॥క॥ స్థిరఁజపలాగందమునై । ఖరిఁ మొదలియడుగుచెప్పఁ *గఁగ వులుపె। ట్టిరిముఖచపలయనెడ్డుపే। రరిదిగవైకుంఠవరద * యఘుజైత్రా॥ ౩౨౦॥ జఘనచపలాకందము ॥ క్షమఁబథరీతిఁబూర్వా । ర్థముచపలాకం దముక్రియఁ * దగునపరా।ర్థముజఘనచపలకుమునీం । ద్రమానసమరాళ * ధాశార్హా ॥ ౩౨౧ ॥ ఉత్సాహలక్షణము ॥ ఈహమీఁఱసూర్యగణము* లేడుగాంతమైనను । త్సాహవృత్తమనఁగఁగృతులఁ * జొగుచుండుసత్కవి వ్యూహానుతులుగాంచికృష్ణుఁ*డొడిసికాళ్లువట్టిపెఁ । ద్రోహిచావుమనుచు ఖరునిఁ*ద్రోచెఁగాళ్లుగామీఁదుఁగాఁ ॥౩౨౨॥తరువోజ॥ శతమఖత్రితయం బు* జలజాపుఁడొకఁడు శతమఖత్రయిమీఁదఁ * జనువిశ్రమంబు । ప్రతిభ

నీయడుగులో*ప్పఁగ రెండుగూర్పఁ। బ్రతిమీఁద నొక్కొక్క*పాదమైతనరుఁ।
జతురంఘ్రులీరీతి*జతగూర్చుసుకవి। చతురవాచాభూషి*జలజాక్షునుతులఁ।
గృతులందుఁ దడవ్రాజ*సియోజనెసఁగఁ గ్రొత్తొత్త కృత్యాదులై చెప్పు* క్షితినెల్లస
భల॥ పంచవిధాక్షరంబులెట్టివనిన.

క॥ మధువమనపురందరభా। మధిచంద్రగణాలిచేతఁ*మమహామభ్యా। మధురాంతరాల్పపూర్వా। గ్రథితాక్షరలై దుదనరు*గ్రంథములందుఁ॥ ౩౨౩
మహాక్షర॥ సూర్యుఁడొకఁడునుమున్నుగాఁదర్వాత* సుత్రాములేవురుపిఱుఁదనొక్క। తారకేశుండుజతయైననిట్టిన* ప్తగణంబులొక్కపాదంబునకుఁ। జేరురెండవపోటనాలవచోటఁ* జిత్రభానుగణంబుగదియుచుండు। నూఱసి లునాలవగణంబుపై ప్రశాంతి*యుత్పలాంగమహాక్షరంబునకు॥ మధ్యాక్షర॥ మునుముగాఁ బ్రాసంబుగూర్చి*మూఁటిపైవిరమంబునిల్పి। చననింద్రయుగళం బుమీఁద*జలజాప్తునొక్కనిఁజేర్చి। యినుమడించిననాలుగణము * లెనసిన నొక్కపాదంబు। నరవకాణించినంతఁ*దగునిట్లుమధ్యాక్కరంబు॥ ౩౨౪
మధురాక్కర॥ మునినిశాశీంద్రసంహార * మూఁటిపై విరతులుంచి। తరణి శక్రత్రయంబును*భామయూఖునితోఁగూర్చి। వరుసతోనేనుగణముల*పా దమొక్కటిసొంపెసఁగు। దొరలఁజెప్పిన నొప్పుఁగృ * తులమధురాక్కరంబు॥ ౩౨౫॥ అంతరాక్కర॥ భానుడిద్దఱాదిత్య* పతులుచంద్రుండు। పూనినాలు గగుచరణ*ములకుఁద్రిగణాంత। మైనవర్ణంబువిరతి*నంతరాక్కరంబు। భా నుశీతాంశునేత్ర*పద్మాక్షమిత్ర॥ ౩౨౬॥ అల్పాక్కర॥ విరమంబు రెంటిపై*విస్త రిల్లు। సురపులిద్దఱు నొక్క సోముండురాఁ। జరణమీమూఁటిచే*సాగియొప్పు। హరిపపర్యంకయల్పాక్కరంబు॥ ౩౨౭॥ మఱియుమంజరి॥ తుదమొదళ్ల నునం టి*దూఁకుశబ్దంబు। వర్జించియతిమాఱు*ప్రాసంబులిడక। ప్రాసంబు లేనిద్వి*పదమై చెలంగఁ। బ్రాసంబుతుదలందుఁ*బదిలంబు చేసి। సాగింపఁగాఁజాల*స త్కవీశ్వరులు। మానంబు పెంపార*భూమిలోపలను। బద్మాక్షుఁడెపుడు చే* పట్టుమంజులు। చందాసనలరారు*జగతిమంజరులు॥ ౩౨౮॥ ద్విపద॥ సురపతి త్రితయంబు*సూర్యుఁడొక్కండు। విగమంబు రెంటిపై*వెలయునొక్కటికి। క్షితిఁదగనీరెంటి*చేనొప్పుద్విపద। మితిలేక చెప్పిన*మేలంద్రుకవులు॥ ౩౨౯॥ త్రిపద॥ తొలుతనునల్వురింద్రులు రెంటమూఁటను। బలభిద్ద్వయంబునురవి యువళిలేకసలరాఁ ద్రిపద॥ ౩౩౦॥ చతుష్పద॥ జలజాసనవి*శ్రమసంయుత మై। లలిషోడశమిత*లఘువ్రులతోడఁ। గలసిచతుష్పద*గతులనుధరలోఁ। నె

ముచే। విరమంబు రెంటిపై*ద్విరదగతి పేరిచే।విజయభద్రము ద్విరదగతిరె ట్టింప*విజయభద్రముచెల్లు * విదురపూజితపాద*వేదసన్నుతనామ । దరచ క్రకార్ముకగ * దాఖడ్గధారణా * తాపించసమగాత్ర*దళితదైత్యస్తోమ॥ మ ధురగతి॥నాలుగుమాత్రలు*నాటినగణములు । నాలుగు రెంటికి*నలివిరమణ ములు। గలసిమధురగతి*కనలునుజగణము। తొలఁగినధృతకౌ*స్తుభగవిరమ ణము॥ ౩౩౮॥హరిగతి॥ నలసభగగములలోపలనేదైననునెనిమిదినాల్గిటిపై విరమము। గలసినహరిగతిచెలువగుఁగృతులం*గవివరులౌనని చెప్పిననియమ ము॥ హరిణగతి॥ నరహారపదియు*నాలుగులములు। కరియతిహరిణ * గతికి నెళవులు॥వృషభగతి॥ఇరువదియెనిమిదిలఘువులుపది*యేనిటవిశ్రాంతియుఁ గూర్చిన। నిరవగువృషగతిపద్మాధిప*యిదివినుమాదరమునముదమున॥

యక్షగానలక్షణము.

సీ॥ తుదనేడులఘువులు*తొలఁగించిచదివినఁద్రిపుటకువృషభగ* తిపద యుగము। లలిఁగడపలనొక్క*లఘువుమానినజంపెమనుద్విరదగతిస * మ పదయుగము । గురుతగురచ్చర * కుతురగవల్లనాహ్వయమేకతాళియా*మ ధురగతికి। నంఘ్రికిర్వదినాలు*గటతాళమున మాత్రలోలివిశ్రాంతిప*ద్మా లుగింటఁ॥ తే॥ దెలియనర్థంబునర్ధచం * ద్రికలువీటి । యక్షగానప్రబంధంబు* లతుకవచ్చు । రగడభేదంబులివియంద్రురసఁగ వీంద్రు । లవితనిజసేవకస్తో మ*యబ్ధిధామ॥ ౩౪౧

ఉదాహరలక్షణము.

సీ॥సప్తవిభక్తులు*సంబోధనంబునుగూడనెన్మిదివిభ*క్తులుగ్రమమునఁ।బతి పేరుదొరలంగఁ*బద్యమొక్కటిఁజెప్పిరగడభేదములుమా*ర్గములుగాఁగఁ।గ ళికలునెనిమిది*వళిములుగావించి దానిలోనగమును * త్కళికఁ జేసి । యది రొయొక్కసమసనం*బయ్యెడుదళము లెన్మిదిఁగూర్చివానికిఁ*దుదవిభక్తి॥ తే॥ బయలుపలిచికట్టకడను*బద్యమొకటి। పలుకవలయునుసార్వవి* భక్తికము గ । నిర్వదాఱుపద్యములందు*నిడిసధాత్రి।నిదియుదాహరణ।మటందు*రిద్ధ చరిత॥సీ॥సంబోధనమునకు * సరసాళిజయపతిప్రథమకువాణివి * రావళియు ను।తృతిద్వితీయకురుఘట*కీర్తిమతియుఁదృతీయకుఁగీర్తిసుభగయు* నటఁజతుర్థి కినిదేవలాభిని*యునుభోగమాలినిపంచమికినెసంగు* పాణియునుగ। శావతి షష్ఠియు*లలితకాంతిమతియుసప్తమికినిఘోణి*సత్కమలయు॥ తే॥నాదిసూ క్తులనామధే*యములువెనుకఁ। బలికినదివేల్పులష్టవి*భక్తులకును।వారుతమ

శక్తిఁ గొలఁదిని*వ్రాలుఫలములిత్రుసాయకద్వయమున*కిందిరేశ॥ సీ॥ సంబు
ద్ధి యెడలించి * సప్తవిభక్తులు పలికినభక్తిన *ద్గతియ సంగ।సంబుద్ధితోఁ గూడ*
సప్తవిభక్తులు పలుక నొప్పారు బ*ద్ధలియనంగ । సంబుద్ధితోఁ బవి * షమవిభక్తు
లతోడఁ బలికినకృతియువి*ద్ధళియనంగఁ।గళికలుత్కళికలు*గమకింపఁబలికిన
కావ్యంబునుత్కళ్ల*కంబునసఁగి॥ తే-గీ॥ నవనిఁజాటు ప్రబంధంబు*లం దుమిగు
ల। నాటుకొని యొప్పచుండుసీ* నాల్గుదెగలుఁ। గానఁబడును ద హారణము*
ల్గానలోల। కామెపల్లి శవల్లవీ*కామకృష్ణ॥ ౩౪౪॥ ఉ॥ శ్రీపసితాసనాభుఁడువ
శీకృతభక్తమనోంబుజుండువి।శ్వాసఘనుఁ డుగ్రసేనుఁ డసురు*వైష్ణుఁ డజేయుఁడ
గణ్యసద్గుణ । ప్రావృతభూషణోజ్జ్వలుఁడ * హాః పతికోటిమరీచిభద్రధం *
త్రావళనాయకావనుఁడు*దారుఁడు గృష్ణుఁడు మమ్ము బ్రోవుత౯ ॥ ౩౪౫॥ కళిక॥
మఱియు దేవకీశౌరసేనికు*మారనిర్మలరత్న రాజము।క్షఅసుటసురలనెల్లఁదా
రుణ*కదనధారుణిఁ దునుము తేజము । బలిమిసంద నసముల్లోపలి * పారిజా
తముధరకుఁ దెచ్చెను।గోలదిమీఱితీసమ్మదంబునఁ*సండలంబులు తల్లికిచ్చెను।
జెలఁగినరునకుసూతకృత్యము*చేసి కౌరవులఁ బరిమార్చెను ।దలఁపుమెఱువని
దాసచయములఁ*దవిలితిరుగనిముక్తిఁజేర్చెను। వెలఁదికొఱకును బాణుచేతు
లు * వేయునఱికినవిక్రమోగ్రుఁడు । జలదములఁ గి దెగడు నొడలున * జాను
మీఱెడు శుభసమగ్రుఁడు ॥ ౩౪౬ ॥ ఉత్కళిక ॥ కమలనేత్రుని రాకరోయు
చు*యమునయొడ్డునఁ దపము సేయుచు । సున్నకాంతనుజూచి రయమున * ను
న్నసుద్దివచించిప్రియమున । నరుఁడు గూర్చిసమిత్రుని నానతి*కరముపట్టెను దా
నిఁదానతి। విదళితాసురసార్వభౌముఁడు*యదుకులాంబుధిపూర్ణసోముఁడు॥
౩౪౭॥ ఉ॥ మానవులార రోగములు మాసును ఁములులేవు సంపదల్ । జానగు
దుఃఖములొద్దొలఁగు*జాఱుసఘంబులు సుందబుద్ధులై ।దీనత నొందనేటికిన*తిస్థిర
భక్తినిఁగొల్వుఁడీపరా।ఫేసులుగాక పీటువను*దేసవుమారకుముక్తికొసమై॥
౩౪౮॥ కళిక॥ మఱియు ప్రేతలనెల్ల*మరులు కొల్పినవానిఁ। దాళవృక్షము లెల్ల*ధ
రణిఁ గూల్చినవాని।గాలిరక్కసుజావఁ*గాలఁదన్నినవాని॥ ౩౪౯ ॥ ఉత్కళిక॥
మందుపావకుఁ గొల్చి * కాండవాహుతి ద్రేల్చి । హార్థిపేర్వటఁగాంచి * పార్థు
నక్కడనుంచి । దారకుండమరించి*చేరఁదెచ్చినమంచి । యరదమెక్కకపూ
ని*పురికివచ్చినవాని॥ చ॥ పులసిలనేలమానవుల* పుట్టువు పావనమయ్యనెప్ప
డుక౯ ।గళవళమేలరోగముల*కాలగతింగడవట్టినీతిబా । ధలును పరిద్రవతావ్య
ధలు*దవ్వులకేచను వాంఛితార్థముల్ ।గలుగున మేయు చెలఁగము*లాధవు చేవ

త్రశాయిచేఁ ॥ కళిక ॥ మఱియుబ్రహ్మమాయఁగెల్చి * మసలుమాం
వాదిచేత । నెఱిఁగిసాంభకునకువరము * లిచ్చిమెఱయుమోదిచేత। ఘృత
యునిమరలగురున * కిచ్చినట్టియమృతుచేత । నతులరాసకేలిసలిపి * నట్టి
ాదినటునిచేతఁ । బింఛిరుబ్బునాఁతిమోాము * పెరుగుదుడుచుకొంటెచేత।
ండుఁగున్నకారుచిచ్చుమరిగిత్రావునమరుచేత। నెలుఁగుతోడఁబోరిమణియు
తిఁగొనినయుజరుచేత । వెలయఁదులసిప్రూసపేరు * వేపికొనినజోగిచేత॥
రా॥ ఉత్కళిక॥ గట్టిగశరపంజరంబు * గట్టఁదలఁచివేగిరంబు। చవుటికడలి
తఁశౌరి * పవనతనయుతోడఁబోరి। తన్నుఁజేరనంతవచ్చిచెన్నుగెలుపునరున
చ్చి। మహిమమెఱయుకృష్ణుచేత * మిహిరకోటిదీప్తచేత॥ ౩౪౯ ॥ శా॥ ఓలం
ాసకునేకమత్సరముతో * సుప్పొంగిపెక్కేడులు। స్లీలాకారమునంగోలంకునడు
నిట్టాడునక్రంబుతోఁ। జాలంగయ్యముచేసిచిక్కినమదస్తంబేరమస్వామి
కేలంబట్టినిమిర్చినట్టిహరికై * కృష్ణాంబుభృన్మూర్తికై ॥ కళిక॥ మఱియు
గాపోదకియునుఖడ్గము * మఱియునుశంఖముఁబట్టినవారికై । మెఱయఁగ
ద్యుచ్చేలముఁదాల్చుక * మెలఁగెడుదధికణపరిదిగ్ధునకై । పెలుచంగదిసినమ
లనిరువురఁ * బిడికిటఁబొడిచినబలుమల్లునకై । వెలయఁగయమునానదిలోఁ
ళియ * విషధరుఁదోలినయదుసింహునకై । విజయునిరథసారథియైగురునృప *
ష్మాదులఁగెలిచినభూపతికై । గజిగాయవనాభిధుముచుకుందుని * గనుదృష్టి
ఁజంపినశ్రీపతికై । బలువిడిదేవకితండ్రినిమధురకుఁ * బట్టముగట్టినగోవిందున
కై । గెలదాల్చినవైఖరిగోవర్ధన * గిరిమోచినమహదానందునకై ॥ ఉత్కళిక ॥
లిస్ఫుట్టువునోముఫలంబుననే। బలువిడిగినగుపేదఱికంబునవే. । సరికొండల
మందుచుఁబైసంబై । పురికింబరమానందముసంబై । కొనియుబ్బుచునచ్చికలి
మిపనికిం। గనియడుకులోసంగినబాపనికి। న్గలిమిచ్చినబాలస్నేహునకై । కలు
ములచేనేలినకృష్ణునకై ॥ ౩౫౦ ॥ మ॥ పురిటింటంబసిబిడ్డచందమునవా * పోవంగ
నాఁడాత్మలో। మురువొప్పన్విషదుగ్ధయుగ్మకుచయై * ముద్దాడురాకాసిగు। రై
ఱిఁగిట్టంబుగఁబాలుద్రావుమిషచే * నిశ్చైవనకాలంబునన్ । ధరణింగూల్చిననం
దపుత్రువలనం * దారా[illegible]ణాధరస్థితుల్ ॥

కళిక॥ మఱియుగీతామృతస * ముద్రసింధునివలన। వఱలుభవపటుతిమి
ర * వనజబంధునివలన । బొంకుపెయ్యెడలేని * భూరిసత్త్వునివలన । జంకు
చ్చెన్నడులేని * సమరనిత్యునివలన । భేదముల్యెడబాపు * కేళిమర్దనువలన। నాది
కారణమూర్తి * యగుజనార్దనువలనఁ। గానరానిపదముల * గాముపానుపువ

లనఁ। బూనిగో ద్రాలికిఁ* బుట్టుకానుపు వలన॥౩౫౨॥ ఉత్కళిక॥ తనుఁబిల్వని
లఁగూఁగ*దిని పాకమింపారఁ। జేసి ద్రౌపది చేత*నాసదీరఁగ మేఁత। యడిగిన
నీశులకు*నిడఁగల్గు దానులకుఁ। గల్పించు హరివలనఁ*గల్పస్థాయి వలన॥౩౫౩॥
శా॥ కారాగారము నుండి వెల్వడి భుజంగ*స్వామి నుద్ఛత్రమై। పై రా
ష్ట్రుండు వాకిలు ద్దెఱువన*భ్రస్తోమముల్ మీఱి ద్రో। సూరోద్భాతి పథంబు
గఁదనుఁ గ్రోం*చుండ ద్రిడియే తెంచి చెల్వారం బెల్లను నిల్పఁ బోల్చు హరికి*నా
లారనేత్రము లొక్కెడన్॥ కళిక॥ మఱియుఁ బెఱయ నెఱయ నుఱియు*మధు
గూల్చినట్టి హరికి। నుఱిమితఱిమి చఱిమి నుఱుము*ఁ గ్రక్కఁగల్చు సవితకరికిఁ। గ
చిచఱచియఱచి పఱచుఁ*గపినిఁ జంపినచ్యుతునకు। మఱగి తిరిగి విఱిగి యొరగు*
ద్దలీడ్చిన యమితునకు। సరలి కెరలి వరలి మరలి*సాళ్వుఁ జంపిన శూరునకు। గరి
మెరి మొరిమి నెరిమి*కామె పల్లి మందిరునకు। నయము బ్రియము రయము
యము*నరునకిడిన కేశవునకు। వ్యయము భయములయము శయము*
కొసఁగు మాధవునకు॥ ఉత్కళిక॥ గొల్ల లెల్లఁ దల్లడిల్లఁ* బెల్లు జల్లు లల్లి
జోనవాన మానవూని*కానరాని కానలోన। నూఁచి లోచి నూఁచి నూఁచి* ద్రో
చినట్టి స్వామునకు॥౩౫౪॥ మ॥ పృథులావంతి వరస్వయంవరమున* న్వింద
నువిందానుజన్। బ్రథసత్త్రాజిని గెల్చి సద్గుణసుభ* ద్రన్భద్ర దోశ్శాంచ
చ్చిధరాధీశు ననుజ్ఞ చేనసలసా*తీకంబు గృహ్యాత్మ కన। ద్వ్యష్టఁ బెండ్లాడిన
ష్ణునందు నిలిచె*న్దీర్ఘ ప్రతాపోన్నతుల్॥ కళిక॥ మఱియు నుగ్ర సేనామాత్య
నందు। నెఱిమీఱి లయకాల*నిత్యునందు। విదురార్చిత పదార*విందు
దు। విదళిత ఘోరారి*బృందునందు। నాభి సువస్త్రాళిప*హారునందు। బలి
ట్టణ ద్వార*పాలునందు। జలగాదిదశతనూ*చ్ఛాదునందు॥౩౫౫॥ ఉత్కళిక॥
సజ్జరాగంబు। రజ్జునాగంబు*కంధి రావాగంబు। మందరాగంబు* రాపుతో
చి। నీపుతో మోచి*వెలయు హరియందు। జలజాక్షునందు॥౩౫౬॥ ఉ॥ ధర
జుఁడంపినం జరిగి*దంతిపురంబున నాంబికేయుతో। ధర్మముఁ జెప్పి దుష్కృత
ల*డగ్గఱ శాంతనవాది సజ్జనుల్। నిర్మలచిత్తు లెల్లఁగను*నేరుపు సన్నభఁ జా
నట్టినిన్। స్మర్మవహాకృతిం దలఁతు*నాదుమనంబున నందనందనా॥ కళిక॥ మఱి
యు గన్యోవాస*మాయఁ దాల్చినఁ జాల। జెఱుముతఱి ద్రౌపదికిఁ*జీరలిచ్చి
నకాల। సఖులతో నదిలోనఁ*జల్దిగుడిచిన బాల। విఖనసుం డెదలోన
వేఁదలిగ్చిన లోల। నరు తేరి నొగలపై*నాట్యమాడిన వీర। సరకుగొని భీష్మ
పైఁ జక్రమెత్తిన శూర। తరిని సద్గురుసుతుల*దాపరించిన సదయ। పెరిమ

రంబు* పెక్కులించినవిజయ॥ ౩౫౮॥ ఉత్కళిక॥ గురుభీష్మ రాధేయు *
రుజన్యపుననేయు। శరవహ్నిఁబయలెక్కి యురమల్లను నెక్కి।తనుగాల్చు
పాండుతనయులేగురిమెండు।బ్రతుకఁజేసినపుణ్యా*వితతదీనశరణ్యా॥ శా॥
చక్రముండవునిన్నునమ్మికొలుతు*న్నీచేసుఖంబబ్బెనీ।కై వేదండమొనర్తునీవ
గని * ప్రాప్తి చేకూరెనీ। కేవిశ్వాసముఁజేర్తునింకమదిలో * హెచ్చు
న్యనీయంశువా। కై వారంబులుశౌరసేనతనయా*కామేపలీవల్లభా॥ ఉ॥
మునవిచ్చగింపుమిట।నన్నయభట్టకృతాంధ్రశబ్దచిం।తామణినిల్పనో క్తిక
నాచతురోపములుల్లసిల్లని।చ్ఛామతినర్పణంబుగ నుసంగతిగామెపలీశనీ
నై।రామయమైతగన్పడదు*దాహరణంబుజగత్ప్రసిద్ధిగా॥సీసంబులనున
దమువిషమంబులు రెండుదెఱంగులయ్యెవానివిశేషంబులెట్టివనిన॥ సీసమా
॥యతినైనఁబ్రాసంబు * నందైనరెంటితోఁ।జెప్పిరేనియుసమ* సీసముగు
నియమముల్దిన్నిపై * నిలిపినసీసంబులాఱుదెఱంగులై * యతిశయిల్లు।
నిమిషంఘులఁబ్రాస * మెక్కింపనల్లకై సర్వతఃప్రాసనీ * సంబనంగఁ।
ప్రాసమాఱుంబ్రథములఁ * బదిలంబుగాపింపనక్కలిప్రాసనీ * సాఖ్యమనఁగ।
దినేనశినిల్పి * రావడేపదమెల్లఁజేయు నెయ్యేదివడి * సీసమనఁగఁ।
ఖండములయందుఁ*బ్రత్యేకయతులుగాస్థిరనవకలివడి*సీసమనఁగఁ। గు
గానుత్సాహ*తుదయందుగీతంబుచెప్పినవిషమాఖ్య*సీసమనఁగ। గడవె
లఘువులే * కల్పించిరెద్దాననర్వలఘుసీ* సంబునఁగ॥ తే॥సప్త విధములివి
శబ్ద* శాసనుండు। పంచమామ్నాయఘక్కిలోఁ*బల్కెఁగాని। కడమ
వులాఱుసీసము*ల్విడిచిపెట్టి।చెలఁగిసమసీసపద్యమే* చెప్పినారు॥ ౩౬౦

అందుసీసలక్షణమెట్టిదనిన.

క॥సురపతులాఱ్గురిపై భాస్కరులిరువురుగూడనొక్క*చరణముపొల్చుం।
రగునవినాలుగడుగుల। విరమముపై రెంటరెంట* వెలయఁగవలయుఁ॥
౬౧॥ క॥ వాసిచరణములునాలుగు। చేసితుదినిగీతమొకటి* చెప్పఁగన
య్యెఁ। సీసముతంగెడదేశవి। భాసురశుభశీల కామె * పలిగోపాలా॥
సమసీసము॥ బ్రతికించెనెవ్వాఁడు*మృతగురుతనయునిమొలఁతవేఁడినమె
* మేలుచేసెఁ। బోషించెనెవ్వాఁడు * పొదివినదాఁకదావానలంబున దో
గించి * పాండుసుతుల। వెడలించెనెవ్వాఁడు వెడపాఁకుబావిలో నూ
రవల్లియై * యున్ననృగుని। మర్దించెనెవ్వాఁడు * మానలంబునవృష్ణియ
[illegible] ॥ తే॥ । వేలువేవాఁడుపాండవ * విపిన

ఘోటకావలిం॥ ఆ-గీ॥ దోలుకృష్ణయంచుఁ * దోరంపుటుత్సాహ। గీత
మొకఁడుమేళ * గింపవిషమ। సీసమునఁగ వెలయు*శ్రీకామపల్లీశ। జమ్మిచెం
తనున్న*చతురవచన॥ ౩౬౬॥ సర్వలఘుసీసము॥ క॥ క్షమప త్రింశల్లఘువు
లు।త్రిమహేశవిరామముగల*దీర్ఘపదచతు। ష్క-మ్ముపై నొకగీతియుర। ప్ర
మథనసర్వలఘుసీస * పద్యమునకగుౕ॥ ౩౬౭॥ సీ॥ కరివరదపరమకృప * ధ
రణిధరసురవినుతకనకవసననరహరి* గరుడగమన। నళినకరపదనయన * దళి
తఖరదనుజచయసరసఖవరగుణనిధి * శరధిశయన। పరమపదనిలయహరి *
పరమపురుషప్రకృతికిఁబరుఁడనినినునిగమని*వహముపలుకునిరతమునుహృ
దయమున*నినుఁదలఁతుననుమనుపుమనియనఘచరితజల*దనిభతనువ॥ తే-
గీ॥సర్వలఘుసీసమీరీతి*సకలసుకవి।వరులుచెప్పుచుండిలమీఁద*వరుసనెల్ల।వా
రుమెచ్చంగసర్వేశ*వారిజాక్ష। కామపల్లీశయచ్యుత * కామజనక॥ క॥ బల
సోదరగీత్యాదితా। ర్యలునాల్గార్యాఖ్యగీతు * లాటవెలఁదితే। టలురెండుస
మములెత్తుక। మలనాహ్వయపదలువిష*మంబులుమూఁడుౕ॥ సమగీతి॥
క్షమఁబథ్యాకందముచం। దమునౕ రెండరలుదెలియఁ*దనరింపౕ। సమమ
నుగీతికృతులలోఁ। గమలాహృదయాబ్జవాస*కమలాక్షా॥ ఉద్గీతి॥ మొదలి
సగముచపలగతిం। బదన్నగముపథ్యగతిని*దొడరంగా। నిదియుద్గీతియనం
దగు।విమరాక్రూరాదివరద * వేణుధరా॥ఉపగీతి॥ ధరఁజపలాకందమువై।
ఖరిన్నగంబైన * కావ్యములౕ। బరగునుపగీతిపూర్వా। మరవ్రజతమిస్ర *
మార్తాండా॥ ౩౬౯॥ ఆర్యాగీతి॥ సముదీరితపథ్యాకం। దముకన్నను నొక్క-
గురువు * దాఁకించినచో। క్షమనార్యాగీతియగు।న్గమలాప్రాణేశపహజ*కం
దంబదయో॥ సమగీతులందునాటవెలఁది॥ మేలుమేలటంచు*మిత్రులుముగ్ధు
లు। వింతవింతయనుచు * విబుధులిద్ద।ఱహాహాయనుచుసూరు * లయిదుగురు
మెచ్చ।నాటవెలఁదిమూఁటు*నలరుసగము॥ ౩౭౦॥ తే-గీ॥ మిత్రుఁడొక్కఁడు
వీణియ*మీఁటుచుండ।విబుధవరులిద్దఱర్థంబు*విప్పిచెప్ప। నినులునిద్దఱువిను
చుండ*నేకగతిని।దేఁటగీతంబుమూఁటను*వాటమయ్యె॥విషమగీతులందునె
త్తుగీతి॥ సురనాథుమీఁద* నూఁగులిరువురు రెంటవిరతి। ధరణిఁబ్రాసంబు *
దనరునెత్తుగీతియండ్రు॥ కమలనగీతి॥ హగణమైనఁజాలునగణ * మైనఁజాలు
హగణ। నగణములును రెండుగలసి * నాటియంఘ్రికేను। తగినవిరతినాలు
గింటఁ*దనరఁబ్రాసమొనవి। మిగులమెఱయుచుండుఁ*గృతులఁగమలనాఖ్య
గీతి॥ ౩౭౧॥ పరపగీతి॥ [illegible]నినిముసుభాను * [illegible]ాదిత్యపతులిద్ద। ఱువలనేగుర

ర్కు*లర్థమునకుఁ । బవడగీతియందుఁ * బ్రాసముల్ సమకూఱు । నవియె యాట
వెలఁది * యందు లేదు ॥ వ ॥ ఇది నవగీతిప్రవేశం బింక బిరుదావళిలక్షణం బెఱిం
గించెద ॥ తే ॥ క్షితిమహారాష్ట్రభాషచేఁ * జెప్పఁబడెడు । భీకరోక్తులు బిరుదు
లై * పెక్కుదనరు । వాని బిరుదావళి యొనర్ప * వలయు నంద్రు । బుధులు సం
బుద్ధిపదములు * పొసఁగఁ గూర్చి ॥ ౩౭౨ ॥ చ ॥ అతిభుజవిక్రమోద్భవము * లై
రిపుకర్ణకఠోరకంబులై । యతులితవీరవాక్యము లయి * యాదిమపార్థివలాం
ఛనంబులై । ప్రతిపదనూతనంబు లయి * భాసిలు సూక్తులు గూర్చి స్వస్తివా
క్యతతులఁ జెప్ప నొప్పు బిరు * దావళి సార్వవిభక్తికంబుగాన్ ॥ చ ॥ సలలితవా
క్యగుంభన ల*సర్వవిభక్తుల దీవనంబులన్ । జెలువగు పద్య మొక్కటిర * చిం
చి సమిమ్ముట గాఁడ కీర్తి సం । కలితచతుష్కషట్కదళ * గద్యము లెన్మిదియుం బడా
ఱునిం । పలరఁగఁ గూర్చి పేర్చి బిరు * దావళిఁ జెప్పఁగ నొప్పు నెంతయున్ ॥ చక్ర
వాళము ॥ క ॥ ఒకపద్యము పిదప నష్టకసందర్భాష్టగద్య * చతురంబగుచుఁ
క్కుఁ జేరు చక్రవాళం । బకటచతుర్భద్రమది యె * యచ్యుతమంకియున్ ॥ క ॥
తొలిసమసనాంత్యవర్ణయు । గళితపునరుక్తిగాఁగఁ * గైకొని సామీ । పృల
సత్సమాసము మొదల । నలరించిన చక్రవాళ * మగుదాశార్హా ॥ తే ॥ అవధ
రింపుము చేవడిఁ న్యప్రభావ । భావనాతీతనిస్తుల * పరమమూర్తి । పూతనా
జైత్రసుత్రామ * పుత్రమిత్ర । మిత్రశశినేత్ర నిర్జర * స్తోత్రపాత్ర ॥ చిత్రకవి
త్వము ॥ సీ ॥ అనులోమము విలోమ * మును నిరోష్ఠ్యము నుదలకట్టును గుడులు శృం*
గములు నతఁ । రవిలోపమును బద * భ్రమకంబు పద్యభ్రమకమును సల్లెంట్లు *
మఱియు నేక । పదియు ద్విపదియుఁ ద్రి * పదియు ననేకవర్ణంబును ద్వ్యక్షరి *
త్ర్యక్షరియును । సరవి నిచ్ఛావాక్య * సంఘట్టనంబును నాదిగాఁ గొన్ని ప * ద్యం
బు లెల్ల । క్షితి నిచిత్రకవిత్వప్ర * సిద్ధనామ । ధేయముల చేతఁ బెంపొంది * తెలి
విమీఱు । వానిఁ దెలియఁగ వచియింతు * వాసుదేవ । నందగోపాంగనాపుత్ర
నరకజైత్ర ॥ అనులోమము ॥ క ॥ దామోదరసామతనధ । రామా సరసాకర
దళ * రథహరి రాధా । కామా సదయాతిపగమ । ధామా వరయాదవకుల *
దారక రాసా ॥ విలోమము ॥ క ॥ సారాకర దాలకువద । యారవమాభామరవ
తి * యాదసమాకా । ధారారిహాథరళదరళ । సారసమారాధనతమ * సా
రదమోదా ॥ నిరోష్ఠ్యము ॥ క ॥ పావనపాఘాబాభా । మావాయును నాఱు
లిపులు * మఱిపద్యములో । భావింపదొరలకుండిన । భూపాలయము నన్ని రో
ష్ఠ్య * ము పిసాళించున్ ॥ ౩౭౩ ॥ క ॥ సరహార్యక్షదయాకర । కరిరక్షణచక్రహ

